# ప్రజా వినియోగ సేవల కోసం శాశ్వత లోక్ అదాలత్




## విభాగము 22(A) న్యాయ సేవ సంస్థల చట్టం 1987లో పేర్కొనబడిన ప్రజా ప్రయోజనాలు




1. వాయు మార్గం, జల మార్గం మరియు రహదారుల ద్వారా ప్రయాణికులను సరుకులను రవాణా చేసే సేవలు సౌకర్యాలు.
2. తంతి, తపాలా, టెలిఫోన్ సేవలు
3. విద్యుచ్ఛక్తి, కాంతి మరియు నీరు ప్రజలకు సరఫరా చేసే సంస్థలు.
4. పర్యావరణ పరిరక్షణ మరియు పారిశుధ్యం.
5. వైద్య శాలలు, చికిత్సలయాలలో అందించే ఆరోగ్య సేవలు.
6. బీమా సేవలు
7. బ్యాంకులు, ఇతర ఆర్థిక సంస్థలు
8. జాతీయ గ్రామీణ ఉపాధి పథకం
9. విద్య మరియు విద్యా సంస్థల సేవలు
10. గృహములు మరియు రియల్ ఎస్టేట్ సేవలు

పై తెలిపిన (10) పది సేవలకు సంబందించి, వినియోగా దారులకు మరియు ఆయా సంస్థలకు గల వివాదములను కోటి రూపాయలు పరిధి వరకు ఎటువంటి కోర్టు ఫీజు ఖర్చు లేకుండా సత్వరంగా పరిష్కరించు టకు గాను ప్రజా ప్రయోజనాల శాశ్వత పీఠమును కర్నూలు, జిల్లా కోర్టు ప్రాంగణమున, న్యాయ సేవాసదన్ భవనము మొదటి అంతస్తు నందు ఏర్పాటు చేయడమైనది.

పైన పేర్కొనబడిన సేవలకు సంబంధించిన వివాదాలకు కోర్టులో వ్యాజ్యము దాఖలు చేయకముందే కోర్టుకు ప్రత్యామ్నాయంగా ఆయా వివాదాల పరిష్కారానికి శాశ్వత ప్రజా న్యాయ పీఠమును ఆశ్రయించువచ్చును.

ఇందులో ఒక రిటైర్డ్ జిల్లా న్యాయమూర్తి అధ్యక్షులుగా మరియు పై పేర్కొనబడిన ప్రజా ప్రయోజన సంస్థలలో అనుభవమున్న ఇద్దరు వ్యక్తులు సభ్యులుగా ఉంటారు.

సాధ్యమైనంతవరకు ప్రజా ప్రయోజనాల శాశ్వత ప్రజా న్యాయపీఠం ఈ వివాదాలను రాజీ మార్గం ద్వారా పరిష్కరించుటకు ప్రయత్నించి, రాజీ మార్గం ద్వారా పరిష్కారం కాని పక్షంలో ప్రవేశపెట్టిన సాక్షాదారాలను అనుసరించి వివాదాలను పరిష్కరించి తీర్పు వెలువరిస్తుంది.

ఈ సంస్థల తీర్పులను (అవార్డు) అవసరమైతే స్థానిక సివిల్ న్యాయ స్థానాలలో ఆయా న్యాయ స్థానాల డిక్రీవలే అమలు పరచుకొనవచ్చును.

ప్రజాప్రయోజనాల శాశ్వత న్యాయపీఠము సామరస్య పూర్వక పరిష్కారాన్ని సూచించే సంస్థ అయితే ఉభయ పార్టీలు ఏకాభిప్రాయానికి రాకపోతే శాశ్వత లోక్ అదాలత్, కేసులోని పూర్వాపరాలను సమీక్షించి విచారణ చేసి తీర్పు చెప్తుంది. ఈ తీర్పు పై అప్పీలు ఉండదు. తీర్పుకు ఉభయ పార్టీలు బద్ధులై ఉండాలి.

ఫిర్యాదు దాఖలు చేసుకొనువారు నేరుగా శాశ్వత ప్రజా న్యాయపీఠము, పర్మినెంట్ లోక్ అదాలత్ ఆఫీసు పనివేళలలో మాత్రమే దాఖలు చేసుకోవాలి.

**ఛైర్మన్**

**ప్రజా ప్రయోజన సేవల శాశ్వత ప్రజా పీఠము కర్నూలు.**


వివరాలకు :

సూపరింటెండెంట్‌ను సెల్ నెం. **9000372377** ద్వార కాని,

పర్సనల్‌గా కాని సంప్రదించగలరు :

అడ్రస్ : 1 ఫ్లోర్, న్యాయ సేవ సదన్, డిస్ట్రిక్ట్ కోర్ట్, కర్నూలు.